# మనం-మన పరిసరాలు

## 1వ తరగతి

F




ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రచురణ,
అమరావతి

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వారిచే ఉచిత పంపిణీ

కె. దాదా ఖలందర్

# మనం - మన పరిసరాలు

## ఒకటో తరగతి

## పరిసరాల విజ్ఞానం

**పాఠ్యపుస్తక అభివృద్ధి, ప్రచురణ సమితి**


శ్రీ డి.మధుసూధనరావు
సంచాలకులు,
రాష్ట్ర విద్యాపరిశోధన శిక్షణసంస్థ, ఆంధ్రప్రదేశ్.
**అమరావతి**

శ్రీ యం.వెంకటకృష్ణారెడ్డి
సంచాలకులు,
ప్రభుత్వ పాఠ్యపుస్తక ముద్రణాలయం, ఆంధ్రప్రదేశ్.
**అమరావతి**

శ్రీ టి.వి.యస్.రమేష్
ప్రొఫెసర్, విద్యాప్రణాళిక, పాఠ్యపుస్తక విభాగం,
రాష్ట్ర విద్యాపరిశోధన శిక్షణసంస్థ,
ఆంధ్రప్రదేశ్.
**అమరావతి**


**సంపాదకులు, సమన్వయం**


డా॥ కె. పాండురంగస్వామి, ప్రొఫెసర్,
విద్యాప్రణాళిక, పాఠ్యపుస్తక విభాగం,
రాష్ట్ర విద్యాపరిశోధన శిక్షణసంస్థ,
ఆంధ్రప్రదేశ్.
**అమరావతి**

డా॥ టి.వి.యస్. రమేష్, కో-ఆర్డినేటర్,
విద్యాప్రణాళిక, పాఠ్యపుస్తక విభాగం,
రాష్ట్ర విద్యాపరిశోధన శిక్షణసంస్థ,
ఆంధ్రప్రదేశ్.
**అమరావతి**





**ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రచురణ, అమరావతి**


విద్యవల్ల వినయం
వినయంతో మెలగాలి

BTPPG

చట్టాలను గౌరవించండి
హక్కులను పొందండి





*First Published 2016*

*New Impression 2017, 2018, 2019*



This Book has been printed on 70 G.S.M. S.S. Maplitho,
Title Page 200 G.S.M. White Art Card

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వారిచే ఉచిత పంపిణీ

*Printed in India*
at M/s **Brahma Teja Paper Products,** Guntur.
For the Director, Andhra Pradesh Govt. Text Book Press,
Amaravathi,
Andhra Pradesh.

— o —

# ముందుమాట

మానవ జీవితంలో బాల్యం అత్యంత ప్రధానమైంది. అందునా ఐదారేళ్ళ ప్రాయం మరింత చురుకైనది. చలనశీలమైనది. ప్రతిదీ తెలుసుకోవాలనీ, తాకిచూడాలనీ, ఆతురత వ్యక్తమయ్యే వయసది. అందుకే అది ఎందుకు? ఇది ఎందుకు? అంటూ సవాలక్ష ప్రశ్నలు అడుగుతుంటారు. ప్రశ్నించడం, పరిశీలించడం పిల్లల సహజలక్షణం. ఈ సహజలక్షణాలే సైన్స్‌కు ఆలంబన. నేడు మనం చూస్తున్న, అనుభవిస్తున్న విశేషాలన్నీ ఇలాంటి ప్రశ్నల పరంపరల్లోంచీ ఆలోచనల దొంతరల్లోంచీ ఆవిష్కృతమైనవే.

ప్రకృతిలో ప్రతిదీ ఎంతో నియమబద్ధంగా అమరి ఉంటుంది. ఎండకాసినా, పండురాలినా, కాకి అరిచినా, చీమ కరిచినా ప్రతిదాని వెనకా ఒక కారణం ఉంటుంది. కారణంతో కార్యం వ్యక్తమవుతుంది. ఇలా కార్యకారణ సంబంధాల పరిశీలనలతోనే శాస్త్రవేత్తలు సైన్స్ సూత్రాలను ఆవిష్కరిస్తుంటారు. సైన్స్ మనిషిని కారణాలు తెలుసుకునే వారిని మారుస్తుంది. ఏదీ గుడ్డిగా నమ్మకుండా తార్కికంగా ఆలోచించి సమస్యలకు పరిష్కారాలు కనుగొనేలా తర్ఫీదునిస్తుంది. విశేషమేమిటంటే ఏ మౌలిక సూత్రాలయితే శాస్త్రీయతకు అవసరమో ఐదారేళ్ళ పసి ప్రాయంలో అవన్నీ నిండుకుండలా తొణికిసలాడుతుంటాయి. దీని అర్థం ఏమిటంటే చిన్నతనంలోనే మానవునిలో జ్ఞానకాంక్ష స్పష్టంగా గోచరిస్తూంటుందన్నమాట. మానవ సహజమైన ఈ కుతూహలాన్ని పాఠశాల అద్భుత సాధనంగా వినియోగించుకోవాలి. అందుచేతనే పిల్లలు స్వేచ్ఛగా మాట్లాడడానికి, చేయడానికి, చర్చించడానికి, చూడడానికి, విశ్రాంతి తీసుకోడానికి అవకాశం కల్పించేదిగా పాఠశాల వ్యవస్థ దృష్టిసారించాలని జాతీయ విద్యా ప్రణాళిక చట్టం-2005 ప్రతిపాదించింది. విద్యాహక్కు చట్టం-2009 కూడా పిల్లలు పాఠశాల ద్వారా భావిజీవితానికి అవసరమైన సామర్థ్యాలను సాధించాలి అని సూచిస్తుంది. ఇందులో శాస్త్రీయ ఆలోచన ఒక కీలక అంశం. దీనిని సాధించడం కోసం పాఠశాల విద్యలో మనం-మనపరిసరాల పేరుతో మూడో తరగతి నుండి శాస్త్రబోధనాభ్యసనం జరుగుతోంది.

ప్రస్తుత కాలమాన పరిస్థితులను, భవిష్యత్ అవసరాలను పరిగణనలోకి తీసుకున్నపుడు, పిల్లల సహజశీలమైన వికాసాన్ని ఐదారేళ్ళ ప్రాయంలో పిల్లలలో ఉన్న ఉత్సుకతను పరిశీలించినపుడు పరిసరాల అవగాహనను కూడా సమాన ప్రాధాన్యతాంశంగా పాఠశాలలో అభ్యసన అనుభవాలను కల్పించాల్సిన అవసరం ఉందని గుర్తించడం జరిగింది. ఇప్పటివరకు పరిసరాల విజ్ఞానాన్ని భాష, గణితంలలో మిళితం చేసి బోధిస్తున్నాం. అలా కాకుండా ఒకటో తరగతి నుండి పిల్లలు తమ పరిసరాల గురించి తెలుసుకొనేందుకు ప్రత్యేకంగా పాఠ్యప్రణాళికలను రూపొందించి అమలు చేయడం జరిగింది. ఇలా ఒకటో తరగతి నుండే పరిసరాల విజ్ఞానంను ప్రత్యేక పాఠ్యాంశంగా అందుబాటులోకి తీసుకురావడం రాష్ట్ర విద్యావ్యవస్థలో మొదటి సారిగా జరుగుతోంది. ఇది ఒక శుభపరిణామం. ఈ పాఠ్యాంశాలు పై తరగతులకు పునాదిగా ఉంటాయి. దీనితో పాటు భాషనేర్చుకోడమన్నది కేవలం తెలుగు పుస్తకానికే పరిమితం కాకుండా గణితంలోంచి, పరిసరాల విజ్ఞానంలోంచి కూడా నేర్చుకోడానికి అవకాశం కల్పించినట్లవుతుంది. తన గురించి చుట్టు పక్కల ఉన్న జంతువృక్షజాలం గురించి తెలుసుకోడానికి మొదటి మెట్టులా ఈ పాఠ్యపుస్తక రూపకల్పన జరిగింది.

శరవేగంగా మారిపోతున్న సాంకేతిక ప్రపంచంలో మన పిల్లలు విజయవంతంగా మనుగడ సాగించాలంటే పిన్నవయసునుండే శాస్త్రీయ భావాలను అంకురింపచేయాలి. పాఠశాలల్లో ఆనందంగా నేర్చుకునే వాతావరణంలోంచి రేపటి ప్రపంచానికి నవీన ఆవిష్కర్తలను అందించాలి. ఈ బృహత్కార్యానికి కర్త, కర్మ, క్రియ అన్నీ ఉపాధ్యాయుడే. ఎంతటి అద్భుతపాఠ్యపుస్తకమైనా అనుభవజ్ఞుడైన ఉపాధ్యాయుని సామర్థ్యానికి సరితూగలేదు అన్న సర్వేపల్లి రాధాకృష్ణన్ మాటలు అక్షర సత్యాలు. ఈ పాఠ్యాంశాల రూపకల్పనలో సహకరించిన టాటా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సోషల్ సైన్సెస్ వారికి విద్యావేత్తలకు, విషయ నిపుణులకు, రచయితలకు, చిత్రకారులకు, అందంగా తీర్చిదిద్దిన డి.టి.పి. లేఔట్ వారందరికీ ధన్యవాదాలు. బాలగేయ రచయితలయిన కీ.శే. జై సీతారామ్, ఆదర్శ స్రామాట్ గార్లకు నమస్సుమాంజలి. తొలిసారిగా రూపొందిన ఈ పాఠ్యపుస్తకాలకు మరింతగా మెరుగుపరచడానికి విద్యావేత్తలు, తల్లిదండ్రులు, విద్యాభిమానుల సలహాలు సూచనలు స్వాగతిస్తున్నాం. ఉపాధ్యాయ మిత్రులు సమర్థవంతంగా పాఠ్యాపుస్తకాలను ఉపయోగించి శాస్త్రీయ అభ్యసనాభిరుచిని పిల్లల్లో పెంపొందిప చేస్తారని ఆశిస్తూ .....

సంచాలకులు
రాష్ట్ర విద్యాపరిశోధన శిక్షణాసంస్థ, ఆంధ్రప్రదేశ్. **అమరావతి**

## రచయితలు

డా॥ టి.వి.యస్. రమేష్, కో-ఆర్డినేటర్,
యస్.సి.ఈ.ఆర్.టి., ఆంధ్ర ప్రదేశ్,

శ్రీ వి. శ్రీని: ్ అసిస్టెంట్,
యం.పి.యు.పి.యస్., తాటిపాడు,
కర్నూలు జిల్లా.

శ్రీ యస్.వి. కామేశ్వరరావు, స్కూల్ అసిస్టెంట్,
యం.పి.యు.పి.యస్., దోర్బలాపురం,
శ్రీకాకుళం జిల్లా.

శ్రీ సి. నాగేంద్రప్రసాద్, యస్.జి.టి.,
యం.పి.పి.యస్., జి.సి.పాలెం,
కర్నూలు జిల్లా.

శ్రీ జె.వి. రమేష్, యస్.జి.టి.,
యం.పి.యు.పి.యస్., వీర్నకొల్లు,
యస్.పి.యస్., నెల్లూరు జిల్లా.

శ్రీమతి జి. సుజాత, స్కూల్ అసిస్టెంట్,
జడ్.పి.హెచ్.యస్., కల్లూరు,
అనంతపురం జిల్లా.

శ్రీమతి వి. స్వర్ణలత, స్కూల్ అసిస్టెంట్,
జడ్.పి.హెచ్.యస్., పాతపట్టిసం,
పశ్చిమగోదావరి జిల్లా.

శ్రీమతి ఎ.వసుంధర, స్కూల్ అసిస్టెంట్,
జడ్.పి.హెచ్.యస్., తిరుచానూరు,
చిత్తూరు జిల్లా.

## చిత్రకారులు

శ్రీ కె. శ్రీనివాస్, డ్రాయింగ్ టీచర్,
జడ్.పి.హెచ్.యస్., కోపల్లె,
పశ్చిమగోదావరి జిల్లా.

శ్రీ బి. కిషోర్ కుమార్, యస్.జి.టి.,
యం.పి.యు.పి.యస్., ఊటుకూరు.

శ్రీ టి. వీరభద్రాచార్యులు, డ్రాయింగ్ టీచర్,
కె.వి.యన్.ఆర్.జడ్.పి.హెచ్.యస్.,
ఐ.భీమవరం, ప.గో.జిల్లా

శ్రీ కె. రాఘవాచారి, డ్రాయింగ్ టీచర్,
జడ్.పి.హెచ్.యస్., మల్కాపూర్.

శ్రీ టి.వి. రామకిషన్, డ్రాయింగ్ టీచర్,
జడ్.పి.హెచ్.యస్., తడకపల్లి.

## కవర్ పేజి

శ్రీ కె. సుధాకరాచారి, యస్.జి.టి.,
యు.పి.యస్., నీలికుర్తి

## డి.టి.పి. & లేఅవుట్ డిజైనింగ్

శ్రీమతి కె.పావని, గ్రాఫిక్ డిజైనర్,
గుంటూరు, ఆంధ్రప్రదేశ్,

# ఉపాధ్యాయులకు సూచనలు

- పరిసరాల పట్ల అవగాహన కలిగించడానికి మనం-మన పరిసరాలు శీర్షికతో 1,2 తరగతులలో పరిసరాల విజ్ఞానశాస్త్రం ఒక పాఠ్యపుస్తకంగా ప్రవేశపెట్టడం జరిగింది.
- ఇంతవరకు మూడవ తరగతి నుండి ప్రారంభించిన పరిసరాల విజ్ఞాన అవగాహన ఇక నుండి 1వ తరగతి నుండే ప్రారంభించాలి.
- జాతీయ విద్యా ప్రణాళిక విజ్ఞానశాస్త్ర పాఠ్యప్రణాళికను రూపొందించడానికి సజీవ ప్రపంచం, ఆహారం, సహజ వనరులు, వస్తువులు, వస్తువులు ఎలా పనిచేస్తాయి, కదిలే వస్తువులు, ప్రజల భావనలు సహజ దృగ్విషయాలు, జీవుని ఎలా నిర్మితమౌతాయి అనే ఇతి వృత్తాలను ఆధారం చేసుకోవాలి అని సూచించింది.
- దీనిని బట్టి 1,2 తరగతుల పరిసరాల విజ్ఞానంలో కుటుంబ భావన, కుటుంబ సభ్యులు సంబంధాలు, శరీర అవయవాలు, వ్యక్తిగత పరిసరాల పరిశుభ్రత, ఆహార పదార్థాలు, పరిసరాలలో ఉండే పక్షులు, జంతువులు, పూలు, పండ్లు, కూరగాయలు, రవాణా సాధనాలు, ఇంట్లో ఉపయోగించే వస్తువులు, వివిధ వృత్తులను నిర్వర్తించే పనివారు, గాలి, నీరు, పగలు, రాత్రి మొదలైన భావనలకు చెందిన అత్యంత ప్రాథమిక అంశాలతో పాఠ్యంశాలు రూపొందాయి.
- ఒకటి, రెండు తరగతులలో విద్యార్థి సొంతంగా చదవడం, రాయడం వంటి సామర్థ్యాలు పూర్తిగా సాధించి ఉండలేరు కాబట్టి ప్రతి భావనను చిత్రాల రూపంలో ప్రవేశపెట్టారు.
- వాక్యాలు, పదాల రూపంలో ఇచ్చిన సమాచారాన్ని ఉపాధ్యాయుడు చదివి వినిపించాలి. తర్వాత పిల్లలు చదివేలా ప్రోత్సహించాలి.
- ప్రత్యక్ష అనుభవం కల్పించేందుకుగాను కొన్ని నిజమైన ఫోటోలను, కొన్ని చిత్రాలను జతచేసారు. వాటిని గురించి పిల్లలను పరిశీలింపచేయాలి.
- ప్రతిపాఠం ఒక ప్రారంభ చిత్రంతో మొదలవుతుంది. ఇది సన్నివేశ చిత్రం. ఈ చిత్రం దిగువన ఉన్న ప్రశ్నలను ఆధారంగా పిల్లలతో చర్చించాలి. అవసరాన్నిబట్టి అనుబంధ ప్రశ్నలు కూడా అడగాలి.
- జతచేయండి, సరైన దానికి సున్నాచుట్టండి, టిక్ గుర్తు పెట్టండి, చిత్రంలో ఏమి జరుగుతుందో మాట్లాడండి, బొమ్మలకు రంగులు వేయండి, మొదలైన కృత్యాలు చేయించేటపుడు కేవలం కృత్యాన్ని పూర్తిచేయడమేకాకుండా దానిని గురించి పిల్లలందరితో మాట్లాడించాలి.
- పిల్లలతో మాట్లాడించేటపుడు ఒక్కొక్క అంశం గురించి మాట్లాడించి, చర్చించాలి. పిల్లలు చెప్పే అనుభవాలన్నింటిని తప్పనిసరిగా వినాలి. అభిప్రాయాలను అంగీకరించాలి. కేవలం సరైన సమాధానం మాత్రమే చెప్పించడం కోసం అన్నట్లుగా చర్చలు ఉండరాదు.
- రేఖా చిత్రాలను కృత్యాలు చేయించడానికి మాత్రమే కాకుండా రంగులు వేయించడానికి కూడా ఉపయోగించాలి. ప్రతి పాఠంలోనూ ఏదైనా ఒక చిత్రాన్ని బోర్డుపై దశల వారీగా గీస్తూ పిల్లలతో నోటు పుస్తకాలు/పలకపై బొమ్మను గీయించాలి. మీకు నచ్చిన పువ్వు, మీకు నచ్చిన పక్షి, జంతువు, చెట్టు మొదలైనవి చెప్పించడంతో పాటు వాటి రేఖా చిత్రాలను కూడా గీయడానికి అవకాశం కల్పించాలి.

- పాఠ్యాంశాన్ని పూర్తిచేసిన తర్వాత ప్రశ్నలు, సమాధానాలు రాయించడం వంటి పనులు చేయకూడదు. పాఠ్యాంశాన్ని నేర్చుకోడం-మూల్యాంకనం రెండూ ఒకదానితో ఒకటి జతపడినవిగా రూపొందాయి కాబట్టి విడిగా ప్రశ్నలు అడిగే ప్రయత్నం అవసరం లేదు.
- మూల్యాంకనంతో పాటు అదనంగా పిల్లలతో చర్చించడానికి తగిన అంశాలను, రేఖాచిత్రాలను ఉపాధ్యాయుడు సేకరించి ఉపయోగించాలి.
- పాఠ్యపుస్తకంలో ఉన్న పదాలు, వాక్యాలు పిల్లలు చదవలేకపోతున్నారు అని ఆందోళన చెందకుండా చిత్రాల ద్వారా విషయావగాహన కలిగించాలి. అందువల్ల అప్రయత్నంగానే పిల్లలు కొన్ని పదాలు, వాక్యాలు గుర్తించి చదవగలుగుతారు.
- పరిసరాల విజ్ఞానం పాఠ్యపుస్తకాన్ని పరిసరాల అవగాహన, శాస్త్రీయ పద్ధతిని నేర్పడానికి మాత్రమే కాకుండా భాషా సామర్థ్యాల సాధనకు కూడా ఉపాధ్యాయుడు ఈ పాఠ్యపుస్తకాన్ని ఉపయోగించుకోవాలి. అయితే చూచి రాయడం (ఉక్తలేఖనం), వల్లెవేయడం వంటి అభ్యసన కృత్యాలను నిర్వహించరాదు.
- పరిసరాలలోని అంశాలపై ప్రాథమిక అవగాహన కల్పించడమే దీని ప్రధాన ఉద్దేశ్యం కాబట్టి ఉపాధ్యాయుడు వివిధ రకాల పక్షులు, జంతువులు, పూలు, పండ్లు, కూరగాయలు, వస్తువులు, వృత్తులు మొదలైనవాటి చిత్రాలు లేదా నమూనాలు సేకరించి తరగతి గదిలో ప్రదర్శించాలి. ఇవన్నీ రోజూ చూసేవే అయినప్పటికి ప్రతిదానిని ప్రత్యక్షంగా పరిశీలింపజేయాలి.
- పిల్లలు స్వంతంగా గీసిన రేఖా చిత్రాలకు, చేసిన నమూనాల ప్రదర్శనకు ప్రాధాన్యతనివ్వాలి. రన్నింగ్ బ్లాక్‌బోర్డును సమర్థవంతంగా వాడుకోవాలి.
- పిల్లలతో రేఖాచిత్రాలు గీయించడానికి చిత్రాన్ని క్రమానుగతంగా గీసే "చర్చాత్మక చిత్ర పద్ధతి"ని ఉపయోగించాలి. అంటే, బొమ్మను మొత్తం ఒకేసారి గీయడం కాకుండా ఒకదాని తర్వాత ఒకటిగా సూచనలు ఇస్తూ గీస్తున్న వస్తువును గురించి ప్రశ్నిస్తూ, పిల్లలతో మాట్లాడిస్తూ గీయించాలి.
- 3 నుండి 5 తరగతులకు ఉద్దేశించిన విద్యా ప్రమాణాలే 1, 2 తరగతులలో కూడా వర్తిస్తాయి. కాబట్టి ఉపాధ్యాయుడు 1,2 తరగతులకు అభ్యసన సూచికలను నిర్ధారించుకొని వాటిని సాధించేందుకు బోధనాభ్యసన ప్రక్రియలను అమలు చేయాలి.
- 1, 2 తరగతుల పరిసరాల విజ్ఞానం బోధనలో ఉపాధ్యాయుడు చిత్రాన్ని ఆధారంగా చేసుకుని, చర్చించడం, పిల్లలతో మాట్లాడించడం, ఒక్కొక్క అంశాన్ని తీసుకొని పిల్లల అనుభవాలను చెప్పించడం, వాటి ఆధారంగా నల్లబల్ల మీద చిత్రాలు, పదాలు ఉపయోగిస్తూ మైండ్ మ్యాపింగ్ చేయడం, చిత్రాన్ని/వస్తువును చూపించి పిల్లలను పరిశీలించమనడం, ప్రశ్నింపచేయడం, పోలికలు భేదాలు చెప్పించడం, సంబంధాలను గుర్తింప చేయడం, ఇచ్చిన అంశాలను వర్గీకరింపచేయడం, గేయాలను పాడించడం, అభినయం చేయించడం వంటి బోధనాభ్యసన ప్రక్రియల ద్వారా పాఠ్యబోధన జరపాలి.
- నిరంతర సమగ్ర మూల్యాంకనం చేసేటప్పుడు మౌఖిక అంశాలకు ఎక్కువ ప్రాధాన్యతను ఇవ్వాలి. సరైన దానిని గుర్తించడానికి టిక్ చేయడం, సున్నా చుట్టడం, గీతలు గీసి జతపరచడం 1,2 పదాలలో సమాధానాలు రాయడం వంటి రాత అంశాలను సంగ్రహణాత్మక మూల్యాంకనంలో భాగంగా ఉపయోగించాలి.



## విషయసూచిక

# జాతీయ గీతం

– రవీంద్రనాథ్ ఠాగూర్

జనగణమన అధినాయక జయహే!
భారత భాగ్యవిధాతా!
పంజాబ, సింధ్, గుజరాత, మరాఠా,
ద్రావిడ, ఉత్కళ, వంగ!
వింధ్య, హిమాచల, యమునా, గంగ!
ఉచ్ఛల జలధి తరంగా!
తవ శుభనామే జాగే!
తవ శుభ ఆశిష మాఁగే
గాహే తవ జయగాథా!
జనగణ మంగళదాయక జయహే!
భారత భాగ్య విధాతా!
జయహే! జయహే! జయహే!
జయ జయ జయ జయహే!!

# ప్రతిజ్ఞ

– పైడిమర్రి వెంకట సుబ్బారావు

భారతదేశం నా మాతృభూమి. భారతీయులందరూ నా సహోదరులు. నేను నా దేశాన్ని ప్రేమిస్తున్నాను. సుసంపన్నమైన, బహువిధమైన నా దేశ వారసత్వ సంపద నాకు గర్వకారణం. దీనికి అర్హత పొందడానికి సర్వదా నేను కృషి చేస్తాను.

నా తల్లిదండ్రుల్ని, ఉపాధ్యాయుల్ని, పెద్దలందర్ని గౌరవిస్తాను. ప్రతివారితోను మర్యాదగా నడుచుకొంటాను. జంతువులపట్ల దయతో ఉంటాను.

నా దేశంపట్ల, నా ప్రజలపట్ల సేవానిరతితో ఉంటానని ప్రతిజ్ఞ చేస్తున్నాను.

వారి శ్రేయోభివృద్ధులే నా ఆనందానికి మూలం.

పాఠం 1

# నేను - నా కుటుంబం



**చిత్రం చూడండి. మాట్లాడండి.**

- చిత్రంలో ఎవరెవరున్నారు? వాళ్లు ఏమి చేస్తున్నారు?
- మీ ఇంట్లో ఎవరెవరు ఉంటారు?
- మీ అమ్మ, మీ నాయనమ్మ కలసి ఏమేమి పనులు చేసుకుంటారు?
- మీ తమ్ముడిని ఆడించడానికి మీ దగ్గర ఏఏ ఆట వస్తువులు ఉన్నాయి?





మా ఇంట్లో నేను, అమ్మ, నాన్న, తాతయ్య, నాయనమ్మ, తమ్ముడు ఉంటాం.



మా నాయనమ్మ జయమ్మ.

మా తాతయ్య వీరయ్య.





మా అమ్మ కమల.

మా నాన్న రమణ.





మా తమ్ముడు తేజ.

నా పేరు రాణి.





ఇది మా టామీ.





## చిత్రాలు చూడండి. మాట్లాడండి.



నా పనులు నేనే చేసుకుంటాను.



నా పుస్తకాలు నేనే సర్దుకుంటాను.





నా దుస్తులు నేనే వేసుకుంటాను.



పెద్దలకు నమస్కరిస్తాను.

- మీరు సొంతంగా ఏయే పనులు చేసుకుంటారు?
- మీరు పెద్దవాళ్లను ఎలా గౌరవిస్తారు?





వంట చేయడంలో అమ్మకు,
నాన్నకు సాయం చేస్తాను.



పాత్రలు శుభ్రపరచడంలో అమ్మకు
సాయం చేస్తాను.



ఇల్లు శుభ్రం చేయడంలో నాన్నకు
సాయం చేస్తాను.



నాన్న తెచ్చిన వస్తువులు ఇంట్లోకి
తెస్తాను.

- మీ అమ్మ చేసే ఏయే పనుల్లో మీరు సాయం చేస్తారు?
- అమ్మ మీ కోసం ఏమేమి చేస్తుంది?
- మీ నాన్న మీ కోసం ఏమేమి చేస్తారు?
- మీ నాన్న చేసే ఏయే పనుల్లో మీరు సాయం చేస్తారు?





నాయనమ్మ మంచి మంచి కథలు చెబుతుంది.
నాయనమ్మ అంటే నాకెంతో ఇష్టం.



తాతయ్యకు, నాయనమ్మకు
కావలసినవి అందిస్తాను.



తాతయ్యతో కలసి చెట్లకు నీళ్లు పెడతాను.

- మీ ఇంట్లో మీకిష్టమైన వారు ఎవరు? ఎందుకు?
- నాయనమ్మ మీకు కథలు చెపుతుందా? మీరు విన్న ఓ కథ చెప్పండి?
- నాయనమ్మ కోసం మీరేం చేస్తారు?
- తాతయ్య మీకు ఏమేమి సంగతులు చెపుతారు?
- తాతయ్య కోసం మీరు ఏం చేస్తారు?





నేను తమ్ముడిని ఆడిస్తాను.



నేను టామీతో ఆడుకుంటాను.
దానికి ఆహారం పెడతాను.



మేమంతా కలసి కబుర్లు చెప్పుకుంటూ భోజనం చేస్తాం.

- మీ తమ్ముడు / చెల్లి / అన్న / అక్కలతో ఏఏ ఆటలు ఆడుకుంటారు?
- మీ ఇంట్లో కుక్క పిల్లి ఉన్నాయా? వాటిని ఏయే పేర్లతో పిలుస్తారు?
- మీ ఇంట్లో అందరూ కలసి ఎప్పుడైనా ఎక్కడికైనా వెళ్ళారా?
- మీ ఇంట్లో అందరూ ఒకేసారి భోజనం చేస్తారా? ఎవరెవరు కలసి భోజనం చేస్తారు?
- ఇంట్లో అందరూ కలసి ఆడుకుంటూ ఉంటే మీకేమనిపిస్తుంది?



మేమందరం కలసి ఆడుకుంటాం.

## నా ఇష్టాలు



నాకు ఇష్టమైన పండు
మామిడి పండు.



నాకు ఇష్టమైన పక్షి
రామ చిలుక.



నాకు ఇష్టమైన కుక్కపిల్ల
టామీ.





నాకు ఇష్టమైన ఆట
తాడాట.



నాకు ఇష్టమైన పువ్వు.
బంతి పువ్వు.



నాకు ఇష్టమైన స్నేహితులు.

■ మీకు ఇష్టమైనవి ఏవో చెప్పండి?





## మాట్లాడండి.



మీ ఇష్టాలు చెప్పండి.






## చిత్రాలు చూడండి. మాట్లాడండి.



మా అమ్మ, నాన్న చేసే పనులు.



మా అమ్మ బట్టలు కుడుతుంది.



మా నాన్న పొలం పని చేస్తారు.

- మీ అమ్మ, నాన్న ఏఏ పనులు చేస్తారు?
- నీకు ఇష్టమైన పని ఏమిటి?

పాఠం 2

# నేను - నా శరీరం

















చిత్రం చూడండి. మాట్లాడండి.

- బాలుడితో చుట్టూ ఉండే భాగాలను గీతలు గీసి కలపండి.
- వాటి పేర్లు చెప్పండి.
- శరీర భాగాల గురించి మాట్లాడండి.





## బొమ్మను పూర్తి చేయండి.



కింది బొమ్మను చూడండి. శరీర భాగాలను గీయండి.



ఏఏ భాగాలు గీసారు? వాటి గురించి మాట్లాడండి.



## పాడుకుందాం..!



ఒకటి ఒకటి ఒకటి
తల ఉన్నది ఒకటి
ఒకటి ఒకటి ఒకటి
ముక్కు ఉన్నది ఒకటి
ఒకటి ఒకటి ఒకటి
నోరు ఉన్నది ఒకటి
రెండు రెండు రెండు
కళ్లేమో రెండు
రెండు రెండు రెండు
చెవులేమో రెండు
రెండు రెండు రెండు
చేతులేమో రెండు
రెండు రెండు రెండు
కాళ్లేమో రెండు









## చిత్రాలు చూడండి. మాట్లాడండి.





శరీరంలో రెండేసి చొప్పున ఉన్న వాటిని గుర్తించండి.

**చిత్రాలు చూడండి. లెక్కించి చెప్పండి, ఖాళీలో రాయండి.**

నా చేతికి ఉన్నాయి ............. వేళ్ళు





నా కాలికి ఉన్నాయి ........... వేళ్ళు



## చిత్రాన్ని గీయండి.



### అద్దంలో నేను

రాణి అద్దంలో చూసుకుని తన తల బొమ్మను ఇలా గీసింది. నీవైతే నీ తల బొమ్మను ఎలా గీస్తావు?





తలలో ఉండే భాగాల గురించి, వాటితో చేసే పనుల గురించి మాట్లాడండి.





## చిత్రాలు చూడండి. మాట్లాడండి.



కింది చిత్రాలను పరిశీలించండి. కాళ్ళతో, చేతులతో చేసే పనుల గురించి మాట్లాడండి.





కాళ్లతో, చేతులతో ఇంకా ఏమేమి పనులు చేస్తారో చెప్పండి.

పాఠం 3

# పూలు



**చిత్రాన్ని చూడండి. మాట్లాడండి.**

- చిత్రంలో ఎవరెవరు ఉన్నారు? వాళ్లు ఏమి చేస్తున్నారు?
- చిత్రంలో ఏఏ పూల మొక్కలు ఉన్నాయి?
- చిత్రంలో ఏ పూలు నీకు బాగా నచ్చాయి?
- మీ ఇంట్లో ఏఏ పూల మొక్కలున్నాయి?
- చిత్రంలో ఉన్న పూలే కాకుండా నీకు ఇంకా ఏ పూలు తెలుసు?





## చిత్రాన్ని చూడండి. మాట్లాడండి.



కింది పూలను చూడండి. పేర్లు చెప్పండి.



పొద్దుతిరుగుడు



గులాబి



మందారం



బంతి



చామంతి



కలువ



జినియా



మల్లె

- చిత్రాలలోని పూల పేర్లు చెప్పండి.
- ఎరుపు రంగు పూలు ఏవి?
- మందార పువ్వు ఏ రంగులో ఉంది?
- మంచి వాసన వచ్చే పూలు ఏవి?
- తెలుపు రంగు పూలు ఏవి?
- సాయంకాలం పూసే పూలు ఏవి?
- మీ ఊర్లో దొరికే పూలు ఏవి?
- మీ ఊర్లో అమ్మే పూలు ఏవి?
- నీకు ఏ పువ్వు ఇష్టం? ఎందుకు?
- మీకు తెలిసిన మరికొన్ని పూల పేర్లు చెప్పండి.



కాగితం పువ్వు



 

## చిత్రాన్ని చూడండి. మాట్లాడండి.

పూలను ఏఏ సందర్భాలలో ఉపయోగిస్తామో చెప్పండి.










- పూలను ఇంకా ఏయే సందర్భాలలో ఉపయోగిస్తారో చెప్పండి?

ఈ పూలు మీరెప్పుడైనా తిన్నారా. తింటే దానికి (✓) మార్కుని పెట్టండి.


అరటి


లవంగం


చింత

- తురాయి పూలతో కోడిపుంజు ఆట మీరు ఎప్పుడైన ఆడారా?
- గంగరావి మొగ్గలతో బొంగరం ఆట మీరెప్పుడైనా ఆడారా?





## చిత్రాన్ని చూడండి. మాట్లాడండి.






- చిత్రంలో ఎవరెవరున్నారు?
- పిల్లలు ఏం చేస్తున్నారు?
- మీరు ఎప్పుడైనా మీ టీచరుకు పూలు తెచ్చి ఇచ్చారా?
- ఏ పూలు ఇచ్చారు?



## పాడుకుందాం..!





చిన్నారి పాపకు సిరిమల్లె పూలు.
బంగారు పాపకు తంగేడు పూలు.
గారాల పట్టికి గన్నేరు పూలు.
సుగుణాల చిట్టికి సంపెంగ పూలు.
మా బుజ్జి తల్లికి మందార పూలు.





## చేయండి. చూడండి



### పూల కుండీ చేద్దాం

సీసాలో నీళ్లు పోయండి.
పూల గుత్తులు కోయండి.
సీసాలో పెట్టండి.









ఈ పూలకుండీలోని మొక్కకు పూలను గీయండి.

బొమ్మకు రంగులు వేయండి.







## చిత్రాన్ని చూడండి. మాట్లాడండి.



సీతాకోకచిలుకలు పూలమీగ వాలుతాయి.

పూలలో ఉండే తేనెను తాగుతాయి.

సీతాకోకచిలుకలు చాలా అందంగా ఉంటాయి.







పాఠం 4

# పండ్లు

**చిత్రం చూడండి మాట్లాడండి.**

- చిత్రంలో ఎవరెవరున్నారు? వాళ్లు ఏమి చేస్తున్నారు?
- కోతి పాపకు ఏమి ఇస్తోంది?
- నీవైతే కోతిని ఏ పండు ఇవ్వమని అడుగుతావు?



## చిత్రాలు చూడండి. చెప్పండి.







అరటిపండు



ఆపిల్



సీతాఫలం



ద్రాక్షపండ్లు



జామ



దానిమ్మ



స్ట్రాబెర్రి



నారింజ



సపోట



రేగు పండు



మామిడి



పనస

- పై వాటిలో మీ ఊరిలో దొరికే పండ్లు ఏవి?
- పై వాటిలో నీకు బాగా నచ్చిన పండు ఏది?
- మీ పాఠశాల దగ్గర ఏఏ పండ్లు అమ్ముతారు?
- నీవు ఏ పండు కొనుక్కొని తింటావు?




## వేయండి. చెప్పండి.



చిత్రాలు చూడండి. రంగులు వేయండి. పేర్లు చెప్పండి.










- పై వాటిలో పసుపు రంగులో ఉండే పండ్లు ఏవి?
- పై వాటిలో పుల్లగా ఉండే పండ్లు ఏవి?
- పై వాటిలో తీయగా ఉండే పండ్లు ఏవి?



## చేయండి. చెప్పండి.





ఏ పండు సగం ఏది? గీతగీసి కలపండి.



ఇందులో ఒకటి కన్నా ఎక్కువ గింజలుండే వాటికి సున్నా చుట్టండి.





ఏవి ఎలా కాస్తాయో చెప్పండి?

| గుత్తులుగా కాసేవి | విడివిడిగా కాసేవి |
|---|---|
| నేరేడు | బొప్పాయి |
| అరటి | నారింజ |
| ద్రాక్ష | జామ |



కొబ్బరి, ఈత, తాటి, ఖర్జూరం మొదలైనవి గుత్తులుగా కాస్తాయి. వీటిని గెలలు అంటారు. మామిడి కాయలు ఎలా కాస్తాయి?



## చేయండి. చెప్పండి.



ఏ పండులో ఏది తినాలో, ఎలా తినాలో చెప్పండి.



అరటి పండును తొక్క వలిచి తినాలి.

దానిమ్మలో తొక్క వలిచి గింజలు తినాలి.







ఆపిల్‌ను కోసి ముక్కలు తినాలి.

నారింజను తొనలు వలిచి తినాలి.





పనసపండును కోసి తొనలు వలిచి తినాలి.

ఈ పండ్లను ఎలా తినాలి?









## చిత్రాలు చూడండి. చెప్పండి.





పండ్లను తినే ముందు
శుభ్రంగా కడగాలి.

ఈగలు వాలిన పండ్లను
తినకూడదు.



## పాడుకుందాం..!

రారండీ..! రారండీ..!
పిల్లల్లారా రారండీ..!
నచ్చిన పండ్లను కోరండి.
మెచ్చిన పండ్లను అడగండి.
ఇచ్చిన పండ్లను కడగండి.
కడుపునిండా తినండి.
హాయిగా ఆటలు ఆడండి.
కమ్మని పాటలు పాడండి





## చిత్రాన్ని చూడండి. చెప్పండి.





- చిత్రంలో ఏమి జరుగుతోంది?
- చిత్రంలో ఎవరెవరు ఉన్నారు?
- పిల్లలు ఏయే వేషాలు వేసారు?
- నీవైతే ఏ పండులా వేషం వేస్తావు?
- ఆ పండు గురించి ఏమేమి చెబుతావు?



## పాడుకుందాం..!



ఆదివారంనాడు అరటి మొలిచింది.
సోమవారంనాడు సుడివేసి పెరిగింది.
మంగళవారంనాడు మారాకు వేసింది.
బుధవారంనాడు బుజ్జిగెల వేసింది.
గురువారంనాడు గుబురులో దాగింది
శుక్రవారంనాడు చూడగా పండింది.
శనివారంనాడు చకచక గెల కోసి,
అందరికి పంచుదాం అరటిపండ్లు.
అమ్మాయి, అబ్బాయి అరటిపండ్లివిగో.





పాఠం 5

# కూరగాయలు

**చిత్రాన్ని చూడండి. మాట్లాడండి.**

- చిత్రంలో ఎవరెవరున్నారు?
- వాళ్లు ఏమి చేస్తున్నారు?
- బండి మీద ఏమేమి కూరగాయలున్నాయి?
- మీ ఇంటికి కూరగాయలు ఎక్కడి నుండి తెస్తారు?
- నీవు ఎప్పుడైనా కూరగాయల మార్కెట్‌కు వెళ్లావా? అక్కడ ఏమేమి చూసావు?
- బండి మీద కాకుండా ఇంకా ఏ విధంగా కూరగాయలు అమ్ముతారు?





## చిత్రాలు చూడండి. మాట్లాడండి.




బీరకాయ


టమాట


బెండకాయ


కాప్సికమ్


సొరకాయ


కాకరకాయ


వంకాయ


చిక్కుడు


కీరదోసకాయ


మిరపకాయ


మునగకాయ

- కారంగా ఉండే కూరగాయ ఏది?
- చేదుగా ఉండే కూరగాయ ఏది?
- పచ్చి కూరగాయలుగా వేటిని తినవచ్చు.
- మీ ఇంట్లో ఏఏ కూరగాయలు వండి తింటారు?
- కూరగాయల్లో ఏది నీకు చాలా ఇష్టం?
- మీ ఊరిలో దొరికే కూరగాయలు ఏవి?
- ఏఏ కూరగాయలతో పచ్చడి చేస్తారు?
- నిన్న, ఈరోజు మీరు తిన్న కూరగాయల పేర్లు చెప్పండి.





## చదవండి. చెప్పండి.



మనం కూరగాయలతో పాటు దుంపలు, ఆకుకూరలు కూడా తినాలి.
అన్ని రకాల కూరగాయలు తినడం మంచిది.
కూరగాయలలో దుంపలు కూడా ఉంటాయి. వాటిని కూడా తినాలి.



కారెట్



ముల్లంగి



చిలగడదుంప



అల్లం



చామదుంప



బీట్‌రూట్



బంగాళదుంప



కంద

కూరగాయలలో కొన్ని పూలు కూడా ఉంటాయి. వాటిని కూడా తినాలి.



అరటి



కాలిఫ్లవర్



కూరగాయలతో పాటు ఆకుకూరలు కూడా ఉంటాయి. వాటిని కూడా తినాలి.



తోటకూర



పుదీన



గోంగూర

- మీకు తెలిసిన మరికొన్ని ఆకుకూరల పేర్లు చెప్పండి.
- మీ అమ్మ గోంగూరతో ఏమేమి తయారు చేస్తుంది?



## చిత్రాలు చూడండి. మాట్లాడండి.



కింది వాటి పేర్లు చెప్పండి. వాటిని మీ ఇంట్లో ఎలా ఉపయోగిస్తారో చెప్పండి.







ఈ కూరగాయతో ఏమేమి వండుతారో చెప్పండి.





కూరగాయలను శుభ్రంగా కడిగి వండుకోవాలి.




## చిత్రాలు చూడండి. మాట్లాడండి.



ఈ కాయలు ఎంత బరువు ఉంటాయో ఊహించి చెప్పండి.





ఈ కాయలలో పచ్చివిగా తినే వాటికి సున్నా (○) చుట్టండి.










చిత్రాలు చూడండి. తేడాలు, పోలికలు చెప్పండి.






 చిత్రాలు చూడండి. మాట్లాడండి. 

రంగులు వేయండి. పేర్లు రాయండి.



















పాఠం 6

# మన నేస్తాలు

**చిత్రాన్ని చూడండి. మాట్లాడండి.**

- చిత్రంలో ఎవరున్నారు? ఏమి చేస్తున్నారు?
- రెండు కాళ్ళు ఉండే జంతువులేవి?
- నాలుగు కాళ్ళు ఉండే జంతువులేవి?
- ఏఏ జంతువులను మీ చుట్టుపక్కల చూశారు?
- మీ ఇంటిలో ఏఏ జంతువులను పెంచుతున్నారు?
- మీ ఊరిలో ఏఏ జంతువులను చూశారు?
- చిత్రంలోని జంతువులు కాకుండా మీకు తెలిసిన జంతువుల పేర్లు చెప్పండి.
- ఏ జంతువు అంటే నీకు ఇష్టం? ఎందుకు?



## చిత్రాలు చూడండి. మాట్లాడండి.











- చిత్రంలో ఎవరున్నారు? ఏమి చేస్తున్నారు?
- కోళ్లు ఏమేమి తింటాయి?
- పిల్లి పాలు తాగడాన్ని గమనించారా? ఎలా తాగుతుంది?
- గేదెలను, ఆవులను ఎక్కడ కట్టి ఉంచుతారు?
- పశువుల పాక పరిశుభ్రంగా ఉండాలి. ఎందుకు?
- పశువుల డాక్టరు ఏమి చేస్తారు?





## చిత్రాలు చూడండి. మాట్లాడండి.







- వర్షంలో తడుస్తున్న పశువులను చూస్తే నీకేమనిపిస్తుంది. అప్పుడు నీవేమి చేస్తావు?
- పాప కుక్క పిల్లను ఎందుకు ఎత్తుకోబోతోంది?

### కొంతమంది వీటిని కూడా పెంచుకుంటారు.



కుందేలు



గొర్రె



మేక



పొట్టేలు

- మేకలు, గొర్రెలు ఏమి తింటాయి?
- వాటిని ఎక్కడ మేపుతారు?
- కుందేలు ఏమి తింటుంది?





## చిత్రాలు చూడండి. మాట్లాడండి.





బల్లి



కప్ప



ఉడుత



జెర్రి



కోతి



తేలు



ఎలుక



పాము



తొండ



ఊసరవెల్లి

- వీటిలో నీవు ఏయే జంతువులను చూసావు?
- వీటిలో నీకు ఏయే జంతువులంటే భయం. ఎందుకు?
- వీటిలో నీకు ఏయే జంతువులంటే ఇష్టం. ఎందుకు?



## చదవండి. చెప్పండి.



కొంత మంది ఆవు, గేదెలనే కాకుండా కోడి, బాతు వంటి వాటిని కూడా పెంచుకుంటారు. వీటిని పక్షులు అంటారు.

**కింది పక్షుల చిత్రాలు చూడండి. వీటిలో ఇళ్లలో పెంచుకునే వాటికి సున్నా (◯) చుట్టండి.**



బాతు



పావురం



కోడి పుంజు



వడ్రంగి పిట్ట



పిచ్చుక



నిప్పుకోడి



చిలక



గోరింక



గుడ్లగూబ



గద్ద



కొంగ



ఇవి కూడా జంతువులే. వీటిని కీటకాలు అంటారు.



బొద్దింక



చీమ



సాలీడు



గొల్లభామ



సీతాకోకచిలుక



దోమ



ఈగ



మిడత



ఆకు పురుగు



## చేయండి. చెప్పండి.



ఈ కింది వాటి పేర్లు చెప్పండి.
రెండింటికి పోలికలు, తేడాలు చెప్పండి.





సాలీడును, చీమను పరిశీలించండి.
ఎన్ని కాళ్ళుంటాయో లెక్కించి రాయండి.



సాలీడుకు కాళ్లు ......................

చీమకు కాళ్లు ......................

ఈగకు కాళ్లు ......................

బొద్దింకకు కాళ్లు ......................





## చదవండి. చెప్పండి.



**సరైన దానికి సున్నా (○) చుట్టండి.**

కొమ్ములు ఉండేది



గింజలు తినేది



రెక్కలు ఉండేది



గడ్డి తినేది



పొడవైన తోక ఉండేది



గాలిలో ఎగిరేది





కింది వానిలో వేరుగా ఉండేది గుర్తించి గడిలో రాయండి.
ఎందుకు వేరుగా ఉందో చెప్పండి.

















## పాడుకుందాం..!



చెట్టు మీద కాకిపిల్ల - కావ్, కావ్, కావ్

కొమ్మ మీద కోయిలమ్మ - కుహూ, కుహూ, కుహూ

గూటిలోన పిచ్చుకమ్మ - కిచ్, కిచ్, కిచ్

చిగురుటాకు రామచిలుక - రాం, రాం, రాం

గుడిసె మీద కోడి పుంజు - కొక్కొరొక్కో

చెరువులోని బాతు పిల్ల - క్వాక్ క్వాక్ క్వాక్

మిద్దెమీద పిల్లికూన - మ్యావ్ మ్యావ్ మ్యావ్

నీటిలోని కప్పలన్ని - బ్యాక్ బ్యాక్ బ్యాక్

మందలోని మేక పిల్ల - మే మే మే

వీధిలోని కుక్క పిల్ల - భౌ భౌ భౌ

చెట్టుకింద ఆవు దూడ - అంబా అంబా అంబా

సంకలోన మాచెల్లి - అమ్మా అమ్మా అమ్మా

దీని గురించి మీ టీచరును అడగండి.



పాఠం 7

# తిందాం.. తిందాం..

నా పేరు రాణి. ఇది మా అత్తయ్య వాళ్ల ఇల్లు.

**చిత్రాన్ని చూడండి. మాట్లాడండి.**

- చిత్రంలో ఎవరెవరు ఉన్నారు? ఏమి చేస్తున్నారు?
- అత్త పిల్లలకు ఏమి తినిపిస్తోంది?
- మీ ఇంట్లో ఇలా తింటారా? ఎప్పుడు తింటారు?
- మీ బంధువులలో ఎవరింటికి వెళ్లినపుడు ఇలా తింటారు?
- మీ అత్తయ్య మీకు ఏమేమి తినిపిస్తుంది?





## కింది చిత్రాలు చూడండి. పేర్లు చెప్పండి.





ఇడ్లీ



పులిహోర



వడ



అరిసెలు



దోసె



అన్నం



పూరీ



పెరుగన్నం



చపాతి

- నువ్వు రోజూ తినేవి ఏవి?
- నువ్వు అప్పుడప్పుడూ తినేవి ఏవి?



ఇవి నాకిష్టం.





















- మీకు ఇష్టమైన వాటి పేర్లు చెప్పండి.





## కింది చిత్రాలు చూడండి. చెప్పండి.

**పావని ఏం చేస్తుందో చూడండి. మాట్లాడండి.**



చేతులు కడిగింది.



భోజనం చేసింది.



కంచం కడిగింది.



కంచం అరమరలో పెట్టింది.

- నువ్వూ ఇలాగే చేస్తావా? వీటిలో ఏవేవి చేస్తావు?
- పావని అలా ఎందుకు చేస్తోంది?



వేటితో ఏమి తయారు చేస్తారో గీత గీసి కలపండి?





























## ఆడుకుందాం! నేర్చుకుందాం!

| | | |
|---|---|---|
| 1 | 2 | 3 |
| 4 | 5 | 6 |
| 7 | 8 | 9 |
| 10 | 11 | 12 |
| 13 | 14 | 15 |

- పాచికల ఆట ఆడండి.
- గడిలో ఉన్న పదార్థాన్ని ఎన్ని రకాలుగా తినవచ్చో చెప్పండి.

## అన్నం తిందాం.

### చిత్రాలు చూడండి. మాట్లాడండి.



అమల అన్నం ఇలా తినింది.



కమల అన్నం ఇలా తినింది.

- కమల ఎలా తింటోంది?
- అమల ఎలా తింటోంది?
- నువ్వు ఎవరిలాగా తింటావు? ఎందుకు?
- కంచు చుట్టూరా అన్నం పడకుండా ఉండాలంటే ఎలా తినాలి?

అన్ని రకాల కూరగాయలు, ఆకుకూరలు తినాలి.

నచ్చినవి మాత్రమే తింటానని మారాం చేయకూడదు.

అన్నం తినే ముందు, తిన్న తరువాత తగినన్ని నీళ్లు తాగాలి.



పాఠం 8

# నేను - మా ఇల్లు

**చిత్రాన్ని చూడండి. మాట్లాడండి.**

నా పేరు చందు. ఇది మా ఇల్లు.

- చిత్రంలో ఏమేమి ఉన్నాయి?
- చిత్రంలో ఎవరెవరు ఉన్నారు. ఏమి చేస్తున్నారు?
- ఇంటి ముందు ఏమి ఉన్నాయి?
- ఇంటి వెనక ఏమి ఉన్నాయి?
- మీ ఇంటి ముందు ఏమేమి చెట్లు ఉన్నాయి?
- మీ ఇంటి ముందు ఎవరి ఇల్లు ఉంది?
- మీ ఇంటి వెనక ఎవరి ఇల్లు ఉంది?
- మీ పక్క ఇంటిలో ఉన్న పిల్లల పేర్లు చెప్పండి?

కింది ఇళ్ళను గమనించండి. ఏ ఇల్లు ఎలా ఉందో చెప్పండి. మీ ఊరిలో ఇంకా ఏ రకమైన ఇళ్ళు ఉన్నాయో చెప్పండి.





పూరిల్లు



రేకుల ఇల్లు



పెంకుటిల్లు




అపార్టుమెంటు

ఐదుగురు కలసి జట్టుగా ఏర్పడండి. ఎవరి ఇల్లు ఏరకంగా ఉందో గుర్తించి గడిలో (✓) గుర్తు వేయండి.

| స్నేహితుడి పేరు | పూరిల్లు | పెంకుటిల్లు | రేకుల ఇల్లు | డాబా | అపార్ట్‌మెంట్ |
|---|---|---|---|---|---|
| | | | | | |
| | | | | | |
| | | | | | |
| | | | | | |
| | | | | | |





## చూడండి. చెప్పండి.

**మీ ఇంట్లో ఇవి ఉన్నాయా? ఎన్ని ఉన్నాయో లెక్కించి రాయండి.**



తలుపు



కిటికీ



అరమర





## చదవండి. చెప్పండి.

**మన ఇల్లు వీటికీ ఇల్లే.**

ఇంట్లో మనతోపాటు సాలీడు, బల్లి, బొద్దింక వంటివి కూడా ఉంటాయి.

మీ ఇంట్లో మీతో పాటు ఇంకా ఏవేవి ఉన్నాయి ?

**కింది బొమ్మలను చూచి (✓) పెట్టండి.**



దోమ



బల్లి



పిల్లి



బొద్దింక



సాలీడు



ఎలుక



చీమ

- పిల్లిని ఎందుకు పెంచుకుంటాం?
- పై వాటిలో మనం పెంచకుండానే మన ఇంటిలో పెరిగేవి ఏవి?





## చిత్రాలు చూడండి. మాట్లాడండి.





మా ఇంటి వెనుక వేప చెట్టుపైన కాకిగూడు ఉంది.

- చిత్రంలో ఏమి కనిపిస్తున్నాయి?
- చెట్ల పైన ఇంకా ఏఏ పక్షులు గూడు కట్టుకుంటాయి?
- నువ్వు ఏదైనా పక్షి గూడును చూసావా?
- అది దేనితో గూడు కట్టుకుంది?



మనం ఇంటిని శుభ్రంగా ఉంచుకోవాలి. చెత్తా, చెదారం లేకుండా చూసుకోవాలి.

- నాన్న ఏమి చేస్తున్నాడు.
- నీవు మీ ఇంటిని శుభ్రం చేసేటప్పుడు ఏమేమి పనులు చేస్తావు?
- మనం మన ఇంటిని ప్రతిరోజు శుభ్రంగా ఉంచుకోడానికి ఏమి చేయాలి?





## చిత్రాలు చూడండి. మాట్లాడండి.







■ చందు వాళ్ళ ఇంటి నుండి బయలుదేరి రాము ఇంటికి వెళ్తున్నాడు. దారిలో అతడు ఏమేమి చూశాడో చిత్రాన్ని చూసి చెప్పండి?



## జతపరచండి.



జంతువును దాని నివాసంతో జతపరచండి.

| | |
|---|---|
| ఆవు | సాలెగూడు |
| ఎలుక | పాక |
| పాము | కన్నం |
| సాలీడు | గూడు |
| కాకి | పుట్ట |



పాఠం 9

# వ్యక్తిగత పరిశుభ్రత



**చిత్రాన్ని చూడండి. మాట్లాడండి.**

- చిత్రంలో ఎవరెవరు ఏమేమి చేస్తున్నారు?
- అది ఏ సమయం అయి ఉంటుంది?
- పొద్దున్నే నిద్రలేచిన తరువాత నువ్వు ఏం చేస్తావు?
- పళ్ళు తోముకోక పోతే ఏమవుతుంది?
- ప్రతిరోజు సబ్బుతో రుద్దుకుని స్నానం చేయాలి. ఎందుకు?
- నువ్వు వారంలో ఎప్పుడెప్పుడు తల స్నానం చేస్తావు?
- స్నానం చేసిన తరువాత మళ్లీ ఆడుకోడానికి మీ అమ్మ వెళ్లనిస్తుందా? ఎందుకు?



పాఠశాలకు వెళ్ళే ముందు చందు ఏమేమి చేసాడో పరిశీలించండి.

## పాడుకుందాం!









పొద్దున మనమూ లేవాలి.
పళ్ళను బాగా తోమాలి.
చక్కగ స్నానం చేయాలి.
ఉతికిన బట్టలు కట్టాలి.
తలను నున్నగ దువ్వాలి.
వేళకు బడికి పోవాలి.
గురువుకు దండం పెట్టాలి.
బడిలోచక్కగ చదవాలి.
ఆటలు బాగా ఆడాలి.
అందరు భేష్ అని పొగడాలి.







# చిత్రాన్ని చూడండి. మాట్లాడండి.





## చేతులు కడుక్కోవడం



- నీవు చేతులు ఎప్పుడెప్పుడు కడుక్కుంటావు?
- నీవు చేతులు ఎలా కడుక్కుంటావు?

మరుగుదొడ్డి వాడిన తరువాత,

అన్నం తినే ముందు, అన్నం తిన్న తరువాత,

ఆటలు ఆడిన తరువాత కాళ్లు, చేతులు శుభ్రంగా కడుక్కోవాలి.

## మన శరీరాన్ని శుభ్రంగా ఉంచుకోవడానికి వాడే వస్తువులు

**మన శరీరాన్ని శుభ్రంగా ఉంచుకోవడానికి వాడే వస్తువులు (✓) టిక్ గుర్తు పెట్టండి.**





- స్నానం చేసేందుకు ఏ వస్తువులు కావాలి?
- పళ్ళు తోముకోవాలంటే ఏమి కావాలి?
- సబ్బును మనం ఎప్పుడెప్పుడు వాడతాం?
- బట్టలు ఉతకడానికి ఏమేమి కావాలి?
- గోళ్ళను ఎలా కత్తిరించుకుంటాం?

**దేనిని శుభ్రం చేసుకోడానికి ఏది ఉపయోగించాలో గుర్తించి వాటికి సున్నా (◯) చుట్టండి.**





## చిత్రాన్ని చూడండి. మాట్లాడండి.



కింది చిత్రాలను చూడండి. ఈ రెండు పనులకు మధ్యలో చేయవలసిన పనుల గురించి మాట్లాడండి.



ఆడుకో. ం.



అన్నం తినడం.



నిద్రపోవడ



బడికిపోవడం.

కింది పనులు మీరే చేసుకుంటారా? ఎవరైన సాయం చేస్తారా? మీరు సొంతంగా చేసుకొనే పనులకు (✓) గుర్తు వేయండి.

స్నానం చేయడం ... ( )

బట్టలు ఉతకడం ... ( )

పళ్ళు తోముకోవడం ... ( )

గోళ్ళు కత్తిరించుకోవడ ... ( )

తల దువ్వుకోవడం ... ( )

అన్నం తినడం ... ( )







## చిత్రాన్ని చూడండి. మాట్లాడండి.



ఈ పనులన్ని ప్రతిరోజు మనం తప్పనిసరిగా చేయాలి. అప్పుడే ఆరోగ్యంగా ఉంటాం.













పాఠం 10

# ఊరికి పోదాం



చిత్రాన్ని చూడండి. మాట్లాడండి.

- చిత్రంలో ఏమేమి ఉన్నాయి?
- చిత్రంలో పిల్లలు ఏం చేస్తున్నారు?
- పిల్లలు దేనిలో ప్రయాణం చేస్తున్నారు?
- మీకు తెలిసిన వాహనాల పేర్లు చెప్పండి?





## చిత్రాలు చూడండి. మాట్లాడండి.





సైకిల్



మోటార్ సైకిల్



స్కూటర్



రిక్షా



జీపు



ఆటో రిక్షా



బస్సు



హెలీకాప్టర్



కారు



విమానం



ఓడ



- వాహనాల పేర్లు చెప్పండి?
- మీ ఇంట్లో ఏయే వాహనాలు ఉన్నాయి?
- మీ ఊరిలో ఏయే వాహనాలు చూస్తుంటావు?
- నీవు ఎక్కువగా ప్రయాణించిన వాహనాలు ఏవి?
- మీరు ఆడుకునే బొమ్మల్లో ఏయే వాహనాల బొమ్మలు ఉన్నాయి?

## చూడండి. చెప్పండి.



కింది చిత్రాలు చూడండి.

**మీరు ప్రయాణించిన వాటికి సున్నా (౦) చుట్టండి.**

**ఆ వాహనంలో ఎక్కడికి వెళ్లారో చెప్పండి.**



**కింది చిత్రాలు చూడండి. తేడాలు చెప్పండి.**





## పాడుకుందాం!



బండెక్కి మనం ఏ ఊరెళదాం.
బండెక్కి మనం బందరు వెళదాం.
సైకిలెక్కి మనం ఏ ఊరెళదాం.
సైకిలెక్కి మనం సాలూరెళదాం.

రైలెక్కి మనం ఏ ఊరెళదాం.
రైలెక్కి మనం రాచూరు వెళదాం.
విమానం ఎక్కి మనం ఏ ఊరెళదాం.
విమానం ఎక్కి మనం వెయ్యూళ్లెళదాం.



# మా ఇంట్లో వస్తువులు

పాఠం 11

**చిత్రం చూడండి. మాట్లాడండి**

- రవి వాళ్ళ ఇంటిలో ఏమేమి వస్తువులు కనిపిస్తున్నాయి?
- పుస్తకాలు ఎక్కడ ఉన్నాయి?
- మీ ఇంట్లో ఏమేమి వస్తువులు ఉన్నాయి?
- చిత్రంలో లేనివి మీ ఇంట్లో ఉన్నవి ఏమిటో చెప్పండి.
- మీ ఇంట్లో ఏ ఏ వస్తువులు ఎక్కడెక్కడ ఉంటాయి?
- మీ పుస్తకాలు మీ ఇంట్లో ఎక్కడ ఉంచుకుంటారు?





## చిత్రాలు చూడండి. మాట్లాడండి.





- ఇది ఏ గది?
- ఈ గదిలో ఏమేమి వస్తువులు ఉన్నాయి?
- మీ వంటింట్లో ఏమేమి వస్తువులు ఉన్నాయి?
- పై చిత్రంలో ఏఏ వస్తువులు మీకు అందుతాయి? ఏవి అందవు?
- ఈ వస్తువులలో ఏవేవి వాడేటప్పుడు జాగ్రత్తగా ఉండాలి?
- మీ ఇంట్లో వంట చేయడానికి ఏమి ఉపయోగిస్తారు?



## చదవండి. చెప్పండి.



మా ఇంట్లో వస్తువులు.

















































- పై చిత్రంలో ఉండే వస్తువుల పేర్లు చెప్పండి?
- వీటిలో వంటింట్లో ఉండే వస్తువులు ఏవి?
- వీటిలో కరెంటుతో పనిచేసే వస్తువులు ఏవి?
- వీటిలో మీ ఇంట్లో ఉన్న వస్తువులు ఏవి?
- ఇవి కాకుండా ఇంకా మీ ఇంట్లో ఏమేమి వస్తువులు ఉన్నాయి?
- అందని వస్తువులను అందుకోడానికి ఉపయోగపడేది ఏది?



## రంగులు వేయండి..!





ఇవన్నీ రవి వస్తువులు. వాటి పేర్లు చెప్పండి. రంగులు వేయండి.





























మీ దగ్గర ఉన్న వస్తువుల పేర్లు చెప్పండి.




## చిత్రాలు చూడండి. మాట్లాడండి.

| అప్పుడు | ఇప్పుడు |
|---|---|
|  |  |
|  |  |
|  |  |

ఇలానే మరికొన్ని చెప్పండి.

పాఠం 12

# పగలు- రాత్రి



**చిత్రం చూడండి. మాట్లాడండి**

- చిత్రంలో ఎవరెవరున్నారు? వాళ్లు ఏమి చేస్తున్నారు?
- పగలు ఆకాశంలో ఏమేమి కనిపిస్తాయి?
- రాత్రి పూట ఆకాశంలో ఏమేమి కనిపిస్తాయి?
- పగలుకు రాత్రికి తేడా ఏమిటి?
- నీవు పగలు ఏమేమి పనులు చేస్తావు?
- రాత్రి ఏమేమి పనులు చేస్తావు?





## చిత్రాలు చూడండి. మాట్లాడండి.







- ఎప్పుడు బట్టలు తొందరగా ఆరిపోతాయి? ఎందుకని?
- మీ ఇంట్లో బట్టలు ఎక్కడ ఆరవేస్తారు?
- మీ అమ్మ బట్టలు ఎప్పుడు ఆరవేస్తుంది?



## చిత్రాలు చూడండి. మాట్లాడండి.



కింది వానిలో వెలుతురు ఇచ్చేవి గుర్తించండి.

















## చదవండి. చెప్పండి.





ఎండలో, లైటు వెలుతురులో, టార్చిలైటు వెలుతురులో నిలబడి మీ నీడను చూడండి. ఉదయం, మధ్యాహ్నం, సాయంత్రం నీళ్ళ సీసా నీడను చూడండి. ఎలా ఉందో చెప్పండి. ఇంకా ఎప్పుడెప్పుడు నీడలు ఏర్పడతాయో చెప్పండి.

ఎండాకాలంలో చెట్టు నీడ చల్లగా ఉంటుంది.





## చిత్రాలు చూడండి. మాట్లాడండి.





- పై చిత్రంలో వాళ్లు ఏం చేస్తున్నారు?
- బట్టలు మాదిరిగా ఎండలో ఆరబెట్టే వస్తువుల పేర్లు చెప్పండి?
- ఉదయం, మధ్యాహ్నం, సాయంకాలం సమయాలలో ఎండ ఎప్పుడు ఎక్కువగా ఉంటుంది?
- మీ అమ్మ ఏయే పదార్థాలను ఎండలో ఆరబెడుతుంది?





## చిత్రాలు చూడండి. మాట్లాడండి.



పగలు కనిపించే వాటికి సున్నా (o) చుట్టండి.

















## పాడుకుందాం...!



ఎండ ఇస్తాను.
పగలంతా ఉంటాను.
ఎవరినీ, నేనెవరిని?





వెన్నెల ఇస్తాను.
రాత్రంతా ఉంటాను.
ఎవరినీ, నేనెవరిని?

ఆకాశంలో ఉంటాను
తళుకు తళుకుమంటుంటాను
ఎవరిని నేనెవరిని?







తెల్లగ నల్లగ ఉంటాను
వానలు కురిపిస్తుంటాను
ఎవరిని నేనెవరిని?

## మీరైతే ఏంచేస్తారు?

ఇలా చేస్తారా?



ఇలా చేస్తారా?



